వీరేశలింగము పంతులు, కందుకూరి, 1848-1919

నీతిచంద్రిక, సంధి

రాజమహేంద్రవరము, 1926

Record no. 171

Vīrēśaliṅgamu pantulu, Kandukūri,
1848-1919

Nīticandrika, Sandhi

Rājamahēndravaramu, 1926

Record no. 171

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వీరేశలింగము, కందుకూరి

నీతిచంద్రిక, సంధి / కందుకూరి వీరేశలింగము చేత రచియింపఁబడినది.- 6. కూర్పు.- రాజమహేంద్రవరము : శ్రీరాజన్ ముద్రాక్షరశాల, 1926.

48, (1) p. ;20 cm.

Record no. 171

Vīrēśaliṅgamu, Kandūkūri

Nīticandrika, Sandhi / Kandūkūri Vīrēśaliṅgamu cēta raciyimpam̐baḍinadi.- 6. kūrpu.-Rājamahēndravaramu : Śrīrājan Mudrākṣaraśāla, 1926.

48, (1) p. ;20 cm.

Record no. 171

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB

Date filming began:

# నీతిచంద్రిక, సంధి.

# NITICHANDRIKA ; SANDHI.

BY

Rao Bahadur

K. VIRESALINGAM PANTULU,

RAJAHMUNDRY.

PRINTED BY

Ch. NAGARAZU PANTULU,

AT

THE RAZAN PRINTING HOUSE,

RAJAHMUNDRY.

1926.

*Price: 6 Annas.*



# నీతిచంద్రిక, సంధి.

—:o:—

ఇది

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధాది గ్రంథములను రచించి

ప్రస్తుతము

రాజమహేంద్రవరమునందలి దొరతనమువారి కాలేజిలో

ప్రధానపండితుఁడగు

## కందుకూరి వీరేశలింగము చేత

రచియింపఁబడినది.

6 వ కూర్పు.

రాజమహేంద్రవరము.

శ్రీ రాజన్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1926.



[దీనివెల ౽ అణాలు.

**TO**

**EDWARD PARR METCALFF Esq., M. A.,**

*PRINCIPAL, PROVINCIAL COLLEGE,*

**Rajahmundry.**

THIS LITTLE VOLUME

IS

**MOST RESPECTFULLY**

DEDICATED

BY THE AUTHOR

**AS A SLIGHT MEMORIAL OF SINCERE ESTEEM.**

# పీఠిక.

---

చిత్రపదములు.

శ్రీకరు నవ్యయు నాద్యున్
లోక చయావన శీలున్
శోక విశోషణు నీశున్
బ్రాకట భక్తిని గొల్తున్.

తేటగీతము.

ఆంధ్రభాషను బద్యకావ్యములు పెక్కు
మున్ను లోకోప కారకంబుగ రచించి
నట్టి నన్నయాదుల నెదయందుఁ గొలిచి
వచనకావ్యంబులను వ్రాయువారిఁదలఁతు.

ఉత్పలమాల.

ఇంతకుమున్ను నేను రచియించిన విగ్రహతంత్ర మెల్లచో
నెంతయుఁ గష్టశైలి రచియింపఁగఁ బడ్డదటంచుఁ బల్మరున్
వింతగ నాకు లేఖలను బెక్కురు వ్రాయుచునుంటఁజేసి య
త్యంతము వ్రాసితిన్ సులభమాగతి దీనిని సంధితంత్రమున్.

తేటగీతము.

పలుమఱు హితోపదేశంబు భారతమును
బంచతంత్రంబుఁ బరికించి, వానిలోన
వలయు కథలను గొని దీని వ్రాసినాఁడఁ
గ్రొత్తగాఁగొంత యందందుఁ గుదురుపఱిచి.

చిత్రపదము.

పెద్దల వేఁడెద దీనన్
దిద్దఁగ దోషములున్నన్
విద్దియ చాలని నన్నున్
దద్దయుఁ గూర్మిక్షమింపన్.

శ్రీరస్తు.

# నీతిచంద్రిక.

## విగ్రహతంత్రముయొక్క కథాసంగ్రహము.

కర్పూరద్వీపమునకు హిరణ్యగర్భుండను మరాళశ్రేష్ఠుఁడు రాజుగానుండెను. ఆతని భృత్యుఁడగు దీర్ఘముఖుండను బకంబు సమస్త దేశంబులంగల విశేషవిషయంబులను జూడవలెనను నభిలాషతో బహు దేశములుతిరిగి కడకు జంబూద్వీపమునకువచ్చి యచటి యరణ్యములో సంచరించుచున్న తద్ద్వీపాధినాథుఁడగు చిత్రవర్ణుండను మయూరరాజు పరిచరులంగాంచి, వారితోడఁ గొంతతడవు సరససల్లాపంబులు జరపెను. అప్పుడు వారు ప్రసంగవశంబున మనదీవుల రాజు లిద్దఱిలో నెవ్వఁడు ఘనుఁడని దీర్ఘముఖుని నడిగిరి. హిరణ్యగర్భుఁడే సర్వవిధముల నుత్తముఁడని సంకోచింపక దీర్ఘముఖుఁడు మాఱుపలికెను. ఆ మాటలకుఁ గోపమువచ్చి యాదీవిపక్షులు దీర్ఘముఖునిం బలువిధముల దూషింపుచు, మా దేశమునం గ్రుమ్మరుచు మారాజునే నిందించెదవా యని యాతనిని బెడతెక్కలు విఱిచికట్టి తమయేలికపాలికిం గొనిపోయి నడచిన సర్వవృత్తాంతమును నివేదించెను. అప్పు డాసభలోఁ గూరుచుండి యున్న యరుణముఖుఁడను కీరము తనరాజుఁజూచి, కర్పూరద్వీపము మొదలుగాఁగలవి జంబూద్వీపములోనివే కాఁబట్టి యాదీవియు దేవరపాలనంబునకు లోఁబడినదే యనియు, ఈయేఁడు మొదలుకొని యేఁటేఁటఁ గప్పముకట్ట హిరణ్యగర్భునికిఁజెప్పి పంపవలయుననియు, విన్నపముచేసెను. అందునకు రాజౌనని తల యూఁచి, ముందుగాఁబోయి యీవార్త నీస్వామికి కెఱిఁగింపుమని దీర్ఘముఖుని విడిచిపుచ్చి, తరువాత నరుణముఖునినే దూతగా హంసస్వామికడకుం బంపెను. ఈలోపలనె చిత్రవర్ణునిమంత్రి దూరదర్శి యను గృధ్రము రహస్యముగా రాజుతో నాలోచించి మేఘవర్ణుం



డను కాకమును రావించి యాతని కెఱిఁగింపవలయు నర్థంబెఱిఁగించి, హిరణ్యగర్భునిమాయోపాయంబునఁ బరాభవించుటకయి పంపెను. ఆకాకియు నీలవర్ణుండని పేరుపెట్టుకొని సింహళద్వీపమునుండి వచ్చితినని బొంకి, తేనెమాటలు పెక్కులుపలికి హిరణ్యగర్భుని యనుగ్రహంబుపడసి, యాతనికొలువునం గరముఁ జనువరియయియుండెను. అప్పుడు మరాళవల్లభుని మంత్రి సర్వజ్ఞుండను చక్రవాకము జంబూద్వీపమున సర్వసంగతులును దీర్ఘముఖునివలన నదివఱకే వినియుండుటం జేసి, యాకాకమును జేరఁదీయవలదని తనరాజున కనేకవిధంబుల బోధించెనుగాని, యాతనివాక్యములన్నియు వ్యర్థములాయెను. ఇంతలో జంబూద్వీపమునుండి యరుణముఖుండువచ్చి తనరాజుచెప్పిన మాటలన్నియు హిరణ్యగర్భుని సభలో వాక్రుచ్చి, యంచలరాయని యభిప్రాయంబెఱింగి నిజదేశంబున కరిగెను. తోడనే సర్వజ్ఞుండు వీరవరుండను సారసపక్షింబిలిపించి యాతనిచే నొకదుర్గంబు నిర్మింపించి, దుర్గ పాలనాధికారంబును నాతనికె యొసంగి, శత్రువార్తలు గుప్తప్రకారంబునఁ దెచ్చుటకయి దీర్ఘముఖునకుఁ దదనుజుని ధవళాంగునిఁ దోడిచ్చి విరోధివీటికిం బుచ్చెను. అంతఁ జిత్రవర్ణుండు వాహినులతోడ వెడలి రెండుదినంబులు యుద్ధముచేసి మేఘవర్ణుఁడుచేసిన మోసముచేత జయమునొందెనుగాని తనసేనాధిపతియగు తామ్రచూడుఁడను కుక్కుటమును బెక్కండ్రువీరులను గోలుపోయెను. మేఘవర్ణుఁడు దుర్గంబున నగ్గిపెట్టిన యనంతరంబున హిరణ్యగర్భుండు శత్రువులచే జుట్టుకోఁబడి తన సేనానియగు వీరవరుని సాహాయ్యంబునఁ బ్రాణంబులు దక్కించుకొని జలంబులంబడియెను. వీరవరుండును స్వామ్యర్థపరిత్యక్తదేహుండయి లోకాంతరగతుండయ్యెను. అప్పుడు చిత్రవర్ణుండు విరోధివీడెల్లఁ జూఱగొని హతశేషసైనిక నికరంబులతో నిజదేశంబునకుం జనియెను.

శ్రీ ర స్తు.

# నీ తి చ ం ద్రి క

---

## సం ధి.

---

తదనంతర మానరవరకుమారు లాధరణీసుర ప్రవరున కిట్లనిరి. "స్వామీ! మీయనుగ్రహంబు కతంబున, విగ్రహమును సమగ్రముగా నాకర్ణించితిమి. దయచేసి యింక సంధిని సహితము ప్రసాదించి మాకుంగర్ణరసాయనంబు గావింపుఁడు. అనవుడు నభ్యస్తసమస్త నీతిశాస్త్రమర్ముండగు విష్ణుశర్ముండిట్లని చెప్పందొడంగె:—

అమ్మాడ్కి భీమసంగ్రామంబున నిహతానేక సైనిక లోకంబులగు మయూరమానసౌకంబులకు గృధ్రచక్రవాకంబులచే క్షణమాత్రంబున సంధిచేయఁబడియె. ఆవిధంబు వివరించెద వినుండు.

ఆరీతిని దారుణంబగు ప్రవిదారణంబున వీరవారంబెల్ల మారణంబు నొందినఁ జింతాక్రాంత స్వాంతుండై వరటాకాంతుండు మంత్రింజూచి—"సర్వజ్ఞా! ఎవ్వఁడు మన దుర్గంబున నట్లగ్గిపెట్టిన దుష్టాత్ముఁడు? పగఱచేఁ బరికింపఁబడి యెవ్వరయినఁ బ్రచ్ఛన్న వేషులయి మనదుర్గంబు నివాసంబుగానుండి మసల మోసపుచ్చి చిచ్చంటించి పోరుగదా?" అనిన వినయావనతుండయి చక్రవాకప్రశస్తుండిట్లనియె.

"దేవా! దేవరవారికి నిష్కారణబంధువై యుండు నీలవర్ణుండిప్పుడే మొకో సపరివారంబుగాఁ గానరాకున్నవాఁడు. నాకుంజూడ నిదియంతయు నావిశ్వాసఘాతుకుని విచేష్టితమయని తోఁచుచున్నది. దేవర యమాయికత్వమే దేవర నింతకుం దెచ్చినది. పుట్టుపూర్వములను విచారింపక యవిశ్వసనీయులగు నభినవాగతులయెడ హృద



యంబు సదయంబుగావించి నమ్మిన పాపఫల మనుభవింప నేఁడు కాలమువచ్చినది." అనిన రాజును క్షణమాత్రంబు స్వాంతంబునఁ జింతించి—"ఇది యంతయు మాదురదృష్టము. మాయదృష్ట మట్లుండఁగా నెవరి ననవలసిన పనియేమున్నది? ఈవిషయంబున దైవప్రాతికూల్య మొక్కటియె కాని మంత్రులదోషంబు లేశంబును లేదు. మనుష్యప్రయత్నముచేఁ గార్య మెంతచక్కఁగా సంఘటింపఁబడినను, దైవయోగముచేతం జెడిపోవును. నిటల లిఖితాక్షరంబులు తుడిచివేయ నెవ్వరిచే నగును?" అని యూరకుండెను.

అపుడు సవినయంబుగా మంత్రి యిట్లనియె—"లోకములోఁ బండితులుకానివారు తమకొక్క విపద్దశ ప్రాప్తమయినప్పుడు, దైవమును గర్హింతురు; కాని, యాత్మకర్మదోషంబుల నెఱుంగఁజాలరు. అపథ్యానురాగులగు రోగులలాగున నృపాలురును హితతంత్రులగు మంత్రుల మతి నతిక్రమించి యాత్మవంచకులయి యభినవప్రియులం బురస్కరించుకొని కార్యంబు ముగిసినవెనుక గర్వము సర్వముందూలి యప్పు డదృష్టముం బేరుకొందురు. సుహృద్గులును హితకాములును నగు సచివులవాక్యంబు లాదరింపనివారు సహవాసిహితోపదేశంబు వినక చెడిన దీర్ఘసూత్రుండను విసారంబుతీరున వినాశంబు నొందుదురు. అక్కథ వక్కాణించెద నవధరింపుఁడు."

ఒక్క యేటిమడుపున దీర్ఘకాలమునుండి, దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుఁడు, దీర్ఘసూత్రుఁడు, నని మత్స్యంబులు మూఁడుకూడి వసియించుచుండును. అట్లుండఁ గొండొకకాలంబునకు వేసవి సమీపించుడు, దీర్ఘదర్శి తక్కటిమీలరెంటిని జేరఁజీరి యిట్లనియె;—"మిత్రులారా! మీరునుం జూచుచున్నారుగదా! ఆదినమున కాదినము వేసఁగి మిగుల నాసన్న మగుచున్నది. ముందు నిక్కముగా నీళ్ళిపుఁ బాటెమతఱిని మన కొండొకచోటికిఁ బోవ శక్యముకాదు. కాఁబట్టి

యిప్పుడే యీయేటంబడి వెడలి యగాధజలంబును జలచరబహుళం బునునగు మఱియొక్కమడువుం జేరుదము." అనినఁ బ్రాప్తకాలజ్ఞుం డిట్లనియె. "భవిష్యదర్థంబునందుఁ బ్రమాణముం గానము; కాఁబట్టి యె బుద్ధిమంతులగువా రెప్పటికేది ప్రాప్తమగునో యప్పటికి దానికిం దగినట్లు కార్యము ననుష్ఠింపఁజూతురు; కాని ముం దెప్పుడో యెప్పుమి రాఁబోవునని యిప్పుడే చిత్తంబున రిత్తవిచారంబు పెట్టుకొని యుండరు. ఇట్టిమడువు మహార్ణవంబువడువున నుండఁగా నిప్పుడె యింతవ్రంత యేల? అంతపుట్టినప్పుడు పోలిన తెఱంగు చూచుకొందము." అనిన దీర్ఘసూత్రుం డేమియు నాలోచన పాలుపోవక యూరకుండె. అంతయు న్విచారించి దీర్ఘదర్శి యిఁక నిందు నిలుచుట కార్యంబు కాదని మున్ముంద మెలంకువపడి జలసమృద్ధంబగు మఱియొక్కమడువుం బ్రవేశించె. ఆవెనుకం గొన్నాళ్ళుగడచిన నెండలు మెండగుటఁ బూఁటపూఁటకు జలంబు లింకఁజొచ్చిన, జాలరులువచ్చి యాఁతలు, చిక్కములు, మీలపుట్టికలు మొదలగువానితోడ నీరంబులం జొచ్చి, విషంబులంగల ఝుషంబుల నెల్లఁ బట్టి త్రాళ్ళం గ్రుచ్చుచుండఁ బ్రాప్తకాలజ్ఞుం డొక్కవెర వూహించి యందొక్కత్రాడు నోరం గఱచికొని గ్రుచ్చినట్టు లంటిపట్టుకొని గ్రుక్కుమిక్కనక యుండెను. అప్పుడు దీర్ఘసూత్రుం డబ్బారింగడచు నుపాయంబుఁ గానక "యేమిచేయుదు నెందుఁజొత్తు" నని తత్తరించుచు నిందునందు మిట్టిమిట్టిపడుచు బుసుకు లాడుచుండంజూచి యాకైవర్తులావాలుగను లగుడంబున నడిచి మడియించిరి. అంత నాధీవరులు మీలవేఁటఁ జాలించి వారిచరంబుల నెడళ్ళనంటిన మంటిని గడుగ మీలగుదుల జలంబుల జాడించు నప్పుడు మీనంబులసందున నిరుదాడలం ద్రాడు గఱచి పట్టుకొని గిట్టినట్టులు కదలమెదలకున్న ప్రాప్తకాలజ్ఞుఁడు మెల్లగాఁ ద్రాడువిడిచి గంభీరవారిం బ్రవేశించి ప్రాణత్రాణంబు కావించుకొనియె. కాఁబట్టి



మిత్రులహితవచనంబులు వినని వాఁడు దీర్ఘసూత్రుని విధంబున నంతంబుఁ జెందును. మఱియు దీన నింకొక విశేషంబుఁగూడ గలదు. ముందుగా ననాగతములగు కార్యంబుల నూహించి మెలఁకువపడువాఁడు దీర్ఘదర్శి విధంబున నాపదం బొరయక సుఖించును; అప్పటికిం దోఁచినట్లు వెరవుపరికించి ధైర్యముతోఁ గార్యము నిర్వర్తింపఁజూచువాఁడు ప్రాప్తకాలజ్ఞుని తెఱంగునఁ బరమసంశయాస్పదంబయిన బ్రదుకుం గాంచును; భవిష్యదర్థంబును గానక సమయోచితంబగు నుపాయంబు తోఁచక యూరకుండువాఁడు దీర్ఘసూత్రుని కైవడిఁ దప్పక యప్పుడ ముప్పుఁ జెందును.

అనునప్పు డొప్పువివారి పీటంబుట్టు వింతల నారసిరాఁ గ్రమ్మఱఁబంపఁబడిన ధవళాంగుండు చనుదెంచి యంచలరాయనిం గాంచి నమస్కరించి యిట్లనియె. "స్వామీ! ప్రతిక్షణంబును దుర్గశోధనంబు కర్తవ్యంబని మున్నే విన్నవించుకొని యున్నాఁడనుగదా? దేవర నా వచనంబులయెడ ననాదరంబు చేసి యాపనిం గావింపరైతిరి. అశ్లేమఱియుంటవలని ఫల మిప్పు డనుభూతంబయినది. గృధ్రాసీతంబయిన మేఘవర్ణుండను వాయసముచేతనే మనదుర్గదాహంబు చేయఁబడినది. అతఁడే మీపాల నీలవర్ణుండనఁ జనువరియై యుండినవాఁడు. ఆప్రకారము—" అనునంతలో నాతనిమాటకడ్డమువచ్చి తలయూఁచి నిశ్వసించి మరాళవల్లభుం డిట్లనియె. "ఔనౌను! ఉపకారంబువలనం గాని ప్రణయంబువలనంగాని కానివాని విశ్వసించినాతఁడు వృక్షాగ్రమున నిద్రించువానివలెనే యధఃపతితుం డగును. సందియము లేదు. తదనంతరోదంతంబు చెప్పుము." అనుడు బకంబిట్లనియె. "ఆప్రకారము దుర్గదాహంబుచేసి డాయువచ్చిన మేఘవర్ణునిఁ జిత్రవర్ణుండు సగౌరవంబుగా బహూకరించి, ప్రసాదమేదురంబుగా మంత్రివంకఁ జూచి యిట్లనియె—

కృతకృత్యుఁడయిన భృత్యునికృతం బూరకపోరాదు. ఆతండు మనోవాక్కుల సంతోషించు ప్రతిఫలమవశ్యము కలుగవలయును. కాఁబట్టి యీమేఘవర్ణునినే యాకర్పూరద్వీపరాజ్యంబున కభిషిక్తునిం జేయుదము." అని చెప్పునప్పుడు పోఁచొప్పు తలఁపునంబాఱి పరధ్యానముతో విచారించుచున్నరాజుం జూచి మంత్రిచక్రవాకంబు: "ప్రణిధి యేమో ముఖ్యాంశంబు మనవియొనరింపఁ బోవుచున్నాఁడు. దేవర పరాకులేక సాకల్యముగా నాకర్ణింపవలయును." అనుడు ఱేఁడు ధవళాంగా! మేము చిత్తగింపుచునే యున్నారము. ఏదీ? తరువాయి వృత్తాంతమును వినిపింపుము." ఆనవుడుం బ్రణిధి యిట్లు విన్నవించుచున్నాఁడు.

అంత నామాటలకుఁ బ్రధానమంత్రియైనదూరదర్శి యిట్లనియె. "దేవా! ఇప్పుడేలినవారు సెలవిచ్చినదంత యుచితంబని నేఁదలంపను. ఈతనికి మేలొనరింపం దలంపుగొంటిరేని, ప్రసాదాంతరము చేయుటయె యెంతయు నర్హకార్యము. చూడామణిస్థానమునం బాదుకల నిడఁగూడనట్లు, మహాత్ములుండఁదగినపదంబునందు నీచుల నెప్పుడును నిలుపరాదు. నీచస్థానయోగ్యునిం దెచ్చి యతిశయస్థానమునందు నిలిపిన భూవిభుండు, కాళ్ళం దొడుగఁదగినపాదుకలం దలధరించినవాని వలెఁ బరిహాసపాత్రుఁడగును. లోకములో దేవర యెఱుఁగనిది మఱి యెవ్వ రెఱుఁగుదురు? పూజించినను నవమానించినను గూడ నపకారంబు చేయుచుండుట యల్పులకు నైజగుణము; శిరంబున ధరించినను గాలం ద్రొక్కినను భుజగంబు బడలుపడం గఱచునుగదా! నీచులు శ్లాఘ్యపదంబుం బొందుదురేని, ఒకానొకప్పుడు మేలుచేసినవారికే ద్రోహంబు చేయఁజింతింతురు. మున్నొకకాలసర్పము వణిజునిచేఁ బ్రతికింపంబడియు, నాతనికే యపకారంబు చేయఁజూచెను. దేవరకాకథ వాక్రుచ్చెద నవధరింపుఁడు.



హిమవంతంబు ప్రాంతంబున నొకకాంతారంబునఁ గాలితెరువున నొకబేహారి చనుచుండెను. ఆయెడ నాయడవియందు దావపావకుండు గడునడరి నలుఁగడలుఁజుట్టియొక్కపట్టుననొక్కపెట్టునఁ బెక్కుచెట్లంగాల్చుచుండెను. అట్లు వెంటనె మంటలు మింటనంటఁగా నానడుమ నొక్క కాలవ్యాళంబు చిక్కుకొని యెక్కడకుంబోవఁ ద్రోవగాకన యాకానం జనుచున్న వాణిజునింగని పేరెలుంగున నిట్లనియె. "ఓయార్తజనశరణ్యా! ఈయరణ్యంబున నలుదెసలుంగ్రమ్మి ముమ్మరమ్ముగఁ జుట్టుకొన్న యీయెరగలింబడి ప్రాణంబులు గోలుపోవలసి వచ్చెఁగావుని రక్షణోపాయంబు తోఁపక దైవంబుం బ్రార్థింపుచుండఁగా నాపాలిటి దైవంబుచందంబున సమయమున సన్నిహితుండయి నాఁడవు. శరణాగతభరణంబున శిబిచక్రవర్తిని దలఁపింపందగు నీయంతటి లోకోత్తరుని శరణొందితిని. ఇఁక నాకేమిగొదవ; జాగుసేయక వేగవచ్చి ప్రాణదానంబుచేసి పుణ్యమునంబొమ్ము. నే విన్నవింపఁ గలదంతయు విన్నవించితిని. పిమ్మటఁ దమచిత్తము నాభాగ్యము" అని మఱియు దీనాతిదీనంబులగు వచనంబులఁ బ్రార్థింప, నాతఁడు దుష్టజంతువ్రంత నహితము చూడఁజాలక యగణ్యకారుణ్యంబున డాయఁబోయి లోపల మిలమిలమెదలుచు నరణ్యరోదనంబు చేయుచున్న జింహాగముంగనుంగొని, తనచేతికఱ్ఱకొనకుం బెనుత్రాటితో నొకసంచిని వ్రేలంగట్టి, యాకఱ్ఱమొదలు చేతంబట్టుకొని యుపాయముగా సంచిని బొదలో జారవిడిచెను. తోడనే యాపన్నంబగు నాపన్నగంబు సంచిలోఁదూఱి చుట్టచుట్టుకొని యుండెను. అంత నాపణ్యాజీవుండు మెల్లగా సంచిని బయిటఁదీసి యాశీవిషము నొకచోట విడిపెట్టెను. మొక్కఁబోయిన గుడివిఱిగి మీఁదఁబడినట్లు తోడనే యాత్రాఁచు బుసకొట్టుచు లేచి, మనుష్యులు పాములం గంటంబడిన తోడనే చంపుచుందురు. కాఁబట్టి యట్టిమాఱులంబున కెల్లను మృత్యు

ప్రియులైనవారిం దొరకినపుడు దొరింపక విడువరాదని పలుకుచు, నాలుకలార్పుచుం గవిసి యాతనిపైఁబడి కఱువఁబోయెను. అందుల కాతం డడలుగడలుకొన వడఁకుచు బరిసరధరాధరదరీద్వారంబులు మాఱుమ్రోయ నఱచుచు సంచి నొకమూలం బాఱవైచి దర్వీకరము వెనుకయుఁ దాను ముందునుగాఁ బఱువఁ జొచ్చెను. ఆచేరువ పొదలో నిదురించుచున్న గోమాయు వాయలుకువిని యులికిపడి లేచివచ్చి, ఫణికిని వణిక్ఛిరోమణికిని నడుమ నిలిచి యిట్లనియె. "ఓ యురగరాజమా! ఏల యూరక రోఁజుచు నీపాఱుఁబోతు వెంటఁబడి పరుగెత్తుచున్నాఁడవు? ఇంచుక సేపు నిలిచి నీవార్త నాతోడఁ జెప్పుము. నాచేతనగు సాహాయ్యంబున్నుం జేసెదను." అనినం గృష్ణాహి తన యాపద్వృత్తాంతంబును బూసగ్రుచ్చిన రీతిని వినిపించెను. అదివిని యక్కజంపడిన ట్లభినయించుచు నక్క యిట్లనియె: "ఓమిత్రమా! ఇప్పుడు నీవుచెప్పిన చరిత్రము విస్రంభపాత్రముగా నేఁ జింతింపను. ఈసంచియెక్కడ? నీదేహమెక్కడ? దీనిలో నీవు దూఱుటయెక్కడ? నీవు చూడఁబోయినఁ బెద్దబారెడున్నావు; సంచియో పట్టెడున్న జేనెడు లేదు. నీవిందు మరలఁజొచ్చి చూపువఱకును నీమాటసత్యమని విశ్వసింపఁజాలను." అనుడు నానాగుబా మప్పుడు సంచిం బ్రవేశించి తొల్లింటి చుట్టుల చుట్టఁజుట్టుకొని లోపల నిమిడియుండెను. వెంటనే యాసృగాలము, మోమున వైవర్ణ్యంబు మిగులఁ బెదవులు తడుపుచు నిలుచున్న యావణిజునకుం జేసైగచేసి యాసంచి మూతినిగట్టిగా దారముతో బిగింపుమని చెప్పెను. అతఁ డాప్రకారముచేసి, తనచేతి బడియతో సంచిమీఁద నాలుగు మోఁదులు మోఁది దందశూకమును స్వర్గలోకమునకుంబుచ్చి, జంబుకంబుంగొనియాడి తనదారిం బోయెను.

కాఁబట్టి క్షుద్రులు తమకుపకారంబు చూపినవారికే యపకారంబు దలంతురు. అంతియ కాక, ముక్కడులయెడం జేసినయుప



కారంబును నిసుకయందు రచించిన ముద్రయుంబోలెఁ జాలకాలంబు నిలువదు. మార్జాలంబును ధర్మకర్తఁగా భావించి సేవింపఁబోయిన శశకపింజలములకుంబోలెఁ దమకెప్పుడు కీడుమూడునో యని యెంచి, ప్రజలును నల్పునిం గొలిచియుండ నొడఁబడరు. మీ కాకథ వాక్రుచ్చెద నాలింపుఁడు.

వింధ్యాటవిలో నొక వృక్షకోటరంబునఁ జిరకాలమునుండి కపింజలంబను పక్షియొకటి కాపురంబుండును. ఒకనాఁటి సూర్యాస్తమయ సమయంబున మొయిలుమొత్తమ్ములు వియత్తల మ్మెల్లఁ గాఱుక్రమ్ముకొని కడవలం ద్రిమ్మరించిన ట్లొక జడివానకురిసెను. ఆవర్షంబునం దడిసి తడిసి యాపులుఁగు వేళకుం దొట్టఁ జేరలేకపోయెను. అప్పుడు దీర్ఘకర్ణంబనుశశం బొక్కఁడు భృశంబును వానను నాని యాశకుంతంబుండు తరుకోటరంబు చేరి, నెమ్మదిగా నందు సుఖనిద్ర చేయుచుండెను. ఇంతలోఁ గపింజలము తన నివాసస్థలి న్వెదకుకొనుచుఁ జిమ్మచీఁకటిలో వచ్చి లోన నిదురించుకుందేలుంగని యదలించి కోపంబుగదుర నిట్లనియె. "ఓరీ! శశాధమా! నేనింటలేనియెడ వచ్చి నీవు కావరంబున నాగృహం బాక్రమించుకొని, నిశ్శంకముగా శయనించుచున్నాఁడవు. ఇకనైన నాలస్యంబుచేయక నాయిల్లు నాకువిడిచి యవలికి లేచిపో. చూడు పోకుంటివా నీప్రాణములు నీవి కావు." అనిన గరువంబున శశం బిట్లనియె. "చాలుఁజాలు. నీబెదరింపుమాట లింతటితోఁ గట్టిపెట్టుము. దీర్ఘకర్ణునిముందఱనా బీరంబులు పలుకవచ్చితివి? వాపీకూపంబులును దటాకంబులును దరువివరంబులును నెవ్వరు ముందుగా నాక్రమించుకొందురో నాఁటికి వారివిగాని యెల్లకాలముఁ బ్రత్యేకముగా నొకరిసొత్తులు గావు. మాటాడక పోపో. పోనొల్లవే నెయ్యెడకైనం దగవునకు రా. పోదము" అనిన "వ్యవహారమునకు రమ్మన్నచో రానవచ్చునా? ఈరాత్రిపుచ్చి వేగినంబోదము. అందాఁక

గొంచె మోపిక పెట్టుము." అని యాకొదవగాత్రి నెట్లో వేగించి తూరుపు తెల్లవాఱుడు శశంబును లేపి, దానితోఁ దగవునకుం బోదము నడువుమని నాలుగడుగులు వెట్టి, యాపిట్ట మనవివాదంబుఁ దీర్పఁగల వాఁ డెవ్వఁడనిన దీర్ఘకర్ణుం డిట్లనియె. "నర్మదానదీతీరంబున దధికర్ణుండను మార్జాలవల్లభుం డొకండు గలఁడు. అతఁడు బహుకాలవృద్ధుఁడు; బహువ్యవహారదర్శి; శాంతమూర్తి; సధర్ముఁడు, అతఁడే మనచిక్కు వదలింపఁదగినవాఁడు. అనినఁ గాఁబోలునని యొడఁబడి యాకపింజలము కుందేటితోడఁ గూడఁ గాల్దెరువునంజని చని మిట్టమధ్యాహ్నమున నా జీర్ణోతువుండు తావుం జేరెను. ఆహా! కాలంబు చేరువయినఁ దల లుత్తరించుకొని పోవుచోటికే పాదంబు లెంతదూరమయిన శరీరధారుల నీడ్చుకొనిపోవునుగదా; అట్లాశశకపింజలములు గమ్యస్థానంబుఁ జేరి, పురోభాగంబున వృద్ధమార్జాలునింగాంచి, కపటధార్మికుఁడును గేవల జఠర పూరకుండును నని యెఱుంగక యిట్లనియె. "ఓమార్జాలనాయకా! మాలో మాకు స్థలవివాదం బొక్కటిపుట్టి దానిని ధర్మస్వరూపులగు స్వామిసమ్ముఖమ్మునం దీర్చుకోవలెనని బహుదూరమునుండి యాశపడి వచ్చినవారము. మమ్ముఁ దడవు కూర్చుండఁబెట్టక నిష్పక్షపాతముగా వేగిరను మావ్యవహారంబు తీర్చి మమ్ము మా నెలవులకుఁ బంపివేయుము." అనిన నాముదుసలిపిల్లి యిట్లనియె:—"అయ్యలారా! మీరేమో దూరమునుండి చెప్పుచున్నారు. జరాభరంబునకుఁ జాంద్రాయణాదివ్రతంబులు తోడుపడఁ గృశించి యింద్రియపటుత్వము తగ్గియున్నవాఁడఁగాన నాశ్రవణంబులు దూరమునుండి మీవాక్యంబులఁ దిన్నగా గ్రహింపనేరకున్నవి. మీరిరువురుం జెఱియొక చెవిచెంతం జేరి మీమీవివాదాంశంబులఁ దేటపడ నుచ్చైస్స్వనంబునం దెలుపునది. మాకనుష్ఠాన సమయంబు సమీపించుచున్నది; మాధ్యాహ్నికంబు లొనరించి దానధర్మములు చేసికోవలెను. అయి



నను దగవుతీర్పఁగలవా రెందఱొందఱో యుండ మీరు వారి నేరింగాదని, నేనేమో నిష్పక్షపాతముగాఁ దీర్చువాఁడనని విని కడుదవ్వుల నుండి వచ్చియున్నవారు. అట్టి మిమ్ముత్తరకపంపుట మముబోటి తపస్వులకు ధర్మంబుగాదు. ఈలోకములోనే యెల్లకాలము నుట్టికట్టుకొని యుండఁగు రాడఁబోము. కాలధర్మము నొందినప్పుడు ధర్మమొక్కటిదక్క నీలోకములోని వేవియుఁ గూడరావు. కాఁబట్టి యట్టి ధర్మమును మాత్రము వేయియాపదలు వచ్చినను జెడనాడుకొనక కాపాడుకొనుచు రావలెను. ఇది యెంతయు సత్యము. సత్య మెప్పుడును దప్పరాదు. సత్యమే సర్వశుభములకు మూలము. సత్యమునకుఁ దోడు భూతదయయు నుండవలెను. భూతదయయే సమస్తధర్మములకు నలంకారము. తనదేహమున నొక్కకంటకము సోఁకినంతనె యెంతనొప్పి కలుగునో యెల్లదేహధారుల శరీరవేదనయు నట్టిదేకదా యని యెఱింగి తత్త్వజ్ఞులెప్పుడును హింసకుం గడుదవ్వుగఁ జరియించుచుందురు. క్రూరకర్ములీయర్థంబెఱుంగక దయయు ధర్మంబును విడిచి దేహయాత్రామాత్రమునకై పరోపతాపంబుచేయఁ బాలుపడుదురు. "స్వాశ్రితావనసమో నహిధర్మ" యని వేదములు ఘోషించునుగదా? కాఁబట్టి యాశ్రితరక్షణమునకు సమానమయిన ధర్మము మఱియొకటిలేదు. విషాభంబగు లోభంబును మొట్టమొదట మొదలంట నున్మూలింపవలయును. ఎంతసంపాదించినను బ్రాణావసాన సమయంబున లోకములోని దేదైనఁ దలఁగట్టుకొనిపోదుమే? ఓదురాశా! పాపభూయిష్ఠంబయిన యీకలికాలంబున నీవెందఱి వశవర్తులం గావించుకొని యెందఱిచే నెన్నిదుష్కార్యములఁ జేయించుచున్నావు? ఓహో! నీపేరు తలఁపునఁ బొఱినంతనె నాగుండెలు పగులుచున్నవి! అని యవ్వృద్ధపిల్లి చల్లనిమాటలతో నల్లన ధర్మోపన్యాసంబులు సేయుచుండ నాశశకపింజలములు విశ్వాసముతో బిడాలమును డాయంబోయి

రెండును రెండుచెవులలోను దనతనవ్యవహారమ్మును జెప్పుకొనుచుండ,
పిట్టతగవు పిల్లితీర్చెనన్న ట్లాజరఠమార్జాలంబు కాళ్ళతో నారెంటిని
జిక్కంబట్టి యొక్కట మెడలుకొఱికి చిత్రవధం బొనరించెను. ప్రాణ
ప్రయాణవేళ న్నశశకపింజలములు: "అయ్యో! ఒక్కరాత్రి కెవ్వరు
పరున్న నేమియని యూరకుండక లేనిపోని వివాదంబు పెట్టుకొని తగ
వునకుఁ బోవుదమను దుర్బుద్ధి యొకటిపుట్ట సుఖముగా బ్రతుకలేక
వేఁకువజామునఁ బడిపోయినట్టులేచి యింతదూరము పరుగెత్తుకొనివచ్చి,
యీఖలుని నాశ్రయించి వీని మిథ్యావాదములు విని వృథా భ్రమ
పడి దుర్మరణంబుఁ దెచ్చుకొంటిమి. పోరునష్టము పొందులాభము
నన్నలోకోక్తి యెన్నఁడైన వ్యర్థమగునా? వినాశకాలము సమీ
పించినప్పు డెవ్వరియాలోచనలు నేల పనికివచ్చును? తానొకటి తలఁ
చిన దైవమొకటితలఁచును. లలాటలేఖా నపునఃప్రయాతి యనవిన
మే?" అని చింతించుచుఁ బ్రాణములు విడిచెను. మార్జాలమును
యథేష్టంబుగ రెండుమూడుదినము లాహారంబు వెదకుకొనక్కఱలేక
వానిని భక్షించుచుండెను.

అప్పుడు చిత్రవర్ణుండు దూరదర్శింజూచి, "మంత్రివరా, నీవు
చెప్పినట్లు మేఘవర్ణుని కుపకారాంతమునే చేయుదము. కాని మున్ముం
దుచేయవలసినపని నొకదానిం జెప్పెద వినుము. మనచే నశ్రమంబున
జయింపఁబడిన కర్పూరద్వీపమునకు మరల నీమేఘవర్ణునినే పంపుదము.
ఈతండుచని యారాజ్యమునంగల యుత్తమపదార్థముల నెల్ల నిరాయా
సంబున నిచ్చటకుం గొనిరాఁగలఁడు. అప్పు డాతెచ్చిన వానిలోఁ
గొన్ని యపూర్వవస్తువుల మనయాప్తులకుం బుత్తము; కొన్ని మేలి
వస్తువులు ప్రకృతివర్గంబున కొసంగుదము; మిగిలినవానిని యథే
చ్ఛముగా మన మనుభవింపఁగలము. ఆపయిని నిష్కంటకముగా మన
మే యెల్లకాలముఁ జలనంబులేకుండ నాదీవి దొరతనంబుఁ జెల్లింపఁ



గలము." అను రాజువచనంబులు విని నవ్వి దూరదర్శి వినయ విధే
యత్వంబులు కాన్పింప మెల్లగా నిట్లనియె. "దేవా! అనాగతకార్యం
బులఁదలఁచి సంతోషింపరాదని నయవిదులు పలుకుదురు. మనోరథ
రాజ్యపాలనంబున నానందించువాఁడు కడపటఁ బేలపిండికుండం బగులఁ
గొట్టుకొన్న మేదినీదివిజునివలెనే విషాదంబు నొందును. ఆకథ విని
పించెదను. వినుండి."

అయోధ్యానగరంబున దేవశర్మ యను బ్రాహ్మణుం డొకఁడు
గలఁడు. ఆమహీసురుఁడు మహావిషువత్సంక్రాంతినాఁడు మఱి యొక
విప్రునియింట శ్రాద్ధమునందు నిమంత్రితుఁడై, యొకసక్తుపూర్ణశరా
వమును దానమునుగాఁ బరిగ్రహించెను. అందువలనతఁడు డెందంబున
నమందానందమునొంది, యాసక్తుఘటముంగొని ఇరవునకరుదెంచుచుఁ
గడుపార శ్రాద్ధభోజనంబు చేసియుంటఁ జేసి నడవఁజాలక యాయా
సపడుచు బొజ్జనిమురుకొనుచు మెల్లన మార్గంబున నొక కుంభకారుని
గృహంబుచేరి యరుగుమీఁద దొంతరలుగానిడిన కడవలకడఁ దన
నీరుకావిదోవతిం బఱచి తలకుఁజుట్టిన యంగవస్త్రముతీసి చుట్టకుదు
రుగాఁ జేసి దానిపయిని సక్తుభాండంబునిడి, సక్తురక్షణార్థంబు దక్షిణ
హస్తంబున దండంబు నొకదానిని ధరించి, యెడమచేయి తలగడగా
నిడుకొని యాపంచెమీఁద శయనించి, కన్నులరమోడ్చి మిఱిమీ
ఱినకోరికలుకోరుచు నిట్లుచింతించెను. "ఈసక్తువును మంచివెల
వచ్చినప్పుడమ్మి యొకపాఁడిమేఁకను గొనియెదను. అది యేఁటేట
రెండేసిపిల్లలఁ బెట్టుచుండును. అవియు వానికిఁ బుట్టినవియు సంవ
త్సరక్రమమునఁ బెఱిగి కొన్నిహాయనములలో బహుసహస్రము
లగును. అప్పుడు వానినన్నిటిని విక్రయించి నూఱుపాఁడిమొదవులం
గొందును. ఆధేనుశతమును కతిపయాబ్దములలోఁ బెక్కుదూడలనీ
నును. అవి యన్నియుఁ గాలక్రమమున మందలు మందలుగా వర్ధిల్లి,

దొడ్లు నిండిపోవును. ఆవల వానిలోఁ గొన్నిటితో విరివిగా వ్యవసాయము సాగించి, పొలములలోఁ బండినపంటలోఁ గొంతవిక్రయించి లక్షసంఖ్యలధనము నార్జించెదను; మఱికొన్ని కోడెలనమ్మి సొమ్ము కూడఁబెట్టెదను. ఆవిత్తముతో నత్తఱి నేను గోటీశ్వరుఁడనగుదును. ఆపిమ్మట మాయింట నేమూలఁజూచినను రొక్కము వెక్కసముగా మూలుగుచుండుట నెఱిఁగి యెల్లవారును నాకు, 'మేము కన్యనిచ్చెదము మేము కన్యనిచ్చెద'మని యింటిచుట్టును దిరిగి పోవుచుందురు. అందులోఁ గులగుణరూపసమన్వితయగు నొకతన్విఁ బెండ్లియాడెదను. ఆలలనవలన నాకుమారునింబోలు కుమారుఁడొకఁడు కలుగును. వానికి మాసోమశర్మపేరే తప్పక పెట్టెదను. గృహకృత్యనిర్వహణాయత్తచిత్తంబున నాసుందరి నందను నెత్తుకొనక నాముందఱ విడిచిపోవఁ గోపంబుపట్టలేక వెనుకపాటునఁ బోయి యామెనుగుదవ నీలగుడంబుననే నాలుగడవు లడఁచెదను" అను సమయమునఁ గొంచెము నిద్రవచ్చి తెప్పలువాల్చి నిజముగా భార్యవచ్చి మ్రోల నిలుచున్నట్టు కలవరించి, యాగ్రహంబునఁ దనకుడిచేతనున్న దండముతో నాపిండికుండను భిన్నభిన్నములుగాఁ గొట్టెను. కఱ్ఱ విసరునప్పు డాదెబ్బలలోఁ గొన్ని యాచేరువనున్న భాండపఙ్క్తులకుం దగిలి కొన్నికుండలు పలిగిపోయెను. అచప్పుడువిని యదరిపడి లోపలినుండి కుమ్మరవాఁడు పరువెత్తుకొనివచ్చి యావెడఁగు బాపనయ్యకు నాలుగు బహుమానంబు లర్పించి, వడివడి నాపుడమివేల్పును జావడి వెడలనడఁచెను. కాఁబట్టి యెందును రాఁబోవు కార్యంబులం దడవికొని సంతోషించువాఁడు మున్నున్నదానిం గూడఁ జెడఁగొట్టుకొనుటయెకాక, సరివారిలో దూఱువడయును.

అప్పుడు మయూరసార్వభౌముండు మంత్రింజూచి యిట్లనియె. "దూరదర్శీ! నీవీవఱకును వచియించిన దంతయు నాదరణీయంబయి



యున్నది. నీమాటచొప్పున మేఘవర్ణుని రాజ్యంబునకుఁ బట్టంబు కట్టఁగూడమికి మేమును నొప్పుకున్నారము. ఇఁకఁ గర్పూరద్వీప పరిపాలనంబునకు మనవారిలో నెవరి నియోగింపవలెనో వాక్రువ్వుము." అనిన మందహాసంబుగావించి, సగౌరవంబుగా దూరదర్శి యిట్లనియె.

"దేవా! మనమిప్పు డాహిరణ్యగర్భునిఁ బరాజయంబు నొందింపంగలుగుట మాయుపాయము చేతఁ గాని, నిక్కంపుఁ బౌరుషంబు చేతంగాదు. ఆతఁడు మహాసత్వసంపన్నుండు; ప్రజారంజకుండు; అసమానమానమహితుండు. కావున నీయవమానంబున కోర్చి యాతం డూరకుండువాఁడు కాఁడు. ఉన్నట్టుండి యెప్పుడో యేమఱుపాటున మనపయింబడి పగఁదీర్చుకొన సమయంబుకొఱకుఁ బ్రతీక్షింపుచుండును. అతని మంత్రియు ననన్యసామాన్య శేముషీమంతుండు; సర్వంకష ప్రజ్ఞగలవాఁడు; సౌజన్యధన్యుఁడు; ప్రతాపదీపితుఁడు. కాలచోదితుండయి వెనుక తేఁ డాతనిమంత్రింబు దెస ననాదరంబు సేయుటం జేసి యీమేఘవర్ణున కందుఁ జేరంగలిగెనుగాని, హిరణ్యగర్భుం డప్పు డాతనిమంత్రింబునే నమ్ముకొని ప్రవర్తించెనేని యింతకుముంద మనమెక్కడ నుండవలసినవారమో దేవరయే యూహింపఁదగియుండును. వెనుకనొకసారి నమ్మి భంగపడియున్నవాఁడవుటంజేసి తొంటి యట్లేమఱియుండక యిఁక జాగరూకతతో మంత్రివాక్యములనే వేదవాక్యములనుగా మన్నించుఁగాన, ముందు మనయాటలేమియు నాతనికడ సాగవు. ఇంతియకాక రాఁబోవునది వర్షకాలము. జలపక్షులగుటం జేసి యాతని సైనికనికాయంబున కది యాలంబున కనుకూలకాలంబై చూపట్టు. స్థలపక్షులగు మనపక్షమువారికో వర్షాకాలదినంబులు దుర్దినంబులయి కానఁబడును. కాఁబట్టి హిరణ్యగర్భునితోడ సంధిగావించుకొని యాతని రాజ్యం బాతనికొసంగుట సముచితకార్యము. హిరణ్యగర్భుని సంగరంబున జయించితిమన్న ప్రతిష్ఠ యిదివఱకే

వచ్చియున్నది. దానంజేసి యిఁక దేవరకీర్తి లోకంబున శాశ్వతంబుగ నెలకొనఁగలదు. అంతకన్న మనకుఁ గావలసినదేమి? హిరణ్యగర్భుం డు దేశకాలానుకూల్యంబు తెఱంగెఱిఁగి మరల సంగరంబునకు రాక తక్కఁడు. పరమర్మభేదనోపాయ ధౌరేయుండగు సర్వజ్ఞుని బుద్ధిసంపదకుఁదోడు సహాయసంపదంగూడఁ బడసి దడంబులతోడ దాడివెడలి మనలందొడరు మరాళరాజున కాజియిచ్చి నొచ్చి యోడి, దిగ్దేశముల వ్యాపించిన యశస్సును గోలుపోక నిలుపుకొనుట యుక్తము. నేఁజెప్పవలసినది చెప్పితిని. ఇఁక దేవరయిష్టము." అనినఁ బకపక నవ్వి బలదర్పంబున నాతనిమాటలు పాటింపక శిఖండీంద్రుం డిట్లనియె.

నీవేమో లోకములోలేని యూహాలనెల్ల నల్లి నేర్పుమెయి న్నిరాధారముగా నాకాశహర్మ్యమును నిర్మింపఁ జూచుచున్నాఁడవు. కాని యది యుక్తిమారుతంబు తాఁకునకుం గదలక నిలువనేరదు. సంగ్రామంబున సర్వంబును బోఁగొట్టుకొని ప్రాణమాత్రావశిష్టుండై యోడిపాఱిన హిరణ్యగర్భుండెక్కడ? సంగ్రామవిజయ గర్వోన్నతి న్మాఱులేక మలయుచున్న చిత్రవర్ణుని నాతండు భండనంబునందాఁకి మానప్రాణంబులు గోలుపోక నిలిచి గెలుచుటెక్కడ? ఈమాట లెవ్వరయిన విన్న నవ్వుదురు. బాహుబలంబున నార్జించుకొన్న నేల నాచికోలేక నిష్కారణముగాఁ జేవిడుచుట వీరధర్మంబుగాదు. రణవిజితుండగు హిరణ్యగర్భుం డిప్పుడు నాచేతిలోనివాఁడ. ఆతని నాతనిరాజ్యంబును నాయిచ్చవచ్చినట్లు చేయఁగలవాఁడను. నీవింక వేయిచెప్పినను రాజ్యంబు విడువఁగలవాఁడనుగాను. ఇంక నీవిషయమున నీవునాతోడ నేమియుఁ జెప్పవలదు." అని, వీరగర్వంబునఁ గొలువువిడిచి లోపలి మందిరంబునకుం జనియెను. అంత మంత్రిముదలగువారును దమతమ నెలవులకు నరిగిరి. నేనును దేవరకు వార్తా



విశేషంబులు విన్నవింపఁ గ్రన్ననఁ జనుదెంచితిని. అని ధవళాంగుం డు సర్వంబును నివేదింప, రాజానుమతంబున సర్వజ్ఞుం డాతని కిట్లనియె. "ధవళాంగా! నీవు మార్గాయాసంబునఁ గడు బడలియున్నవాఁడవు. ఇప్పుడు గృహంబునకుంబోయి యలసట వాపికొని, పిమ్మట నెమ్మదిగా మఱియొకసారి దొరవారిని సందర్శించుకొమ్ము. నికు మేము మిక్కిలి శ్రమ యిచ్చినారము. నీస్వామిభక్తికిని గార్యనిర్వాహకత్వంబునకును స్వామియు నేమును స్వాంతంబున నెంతయు సంతసించినారము. నీవింకఁ బోయిరమ్ము." అని వీడుకోలిచ్చిన, నాబకంబును మనంబునఁ గరంబు నయంబును భయంబును గదురఁ దేనికిని మంత్రికిని మ్రొక్కి తనయిక్కకుం జనియెను.

ధవళాంగుండు నిజమందిరంబునకరిగిన యనంతరంబున హిరణ్యగర్భుండు మంత్రితోడ నేకతముండి, కార్యాలోచనంబడిగినఁ బ్రెగ్గడ యిట్లనియె. మన మిదివఱకే బవరంబున నోటువడి వాసిచెడి యున్నవార మగుటంజేసి, యిప్పు డావిరోధివరూథినీజాలంబు నెక్కటిం దాఁకి వీఁక చెడక నిలువఁజాలము. బలశాలియగు విరోధిని సాధింపఁ దలంపుగొన్నవాఁడు, అంతకంటె బలవంతునితోడఁ జెలికారంబువాటించి యామేటిమగనిం దనవైరిమీఁదికిం బ్రేరేపింపవలయునని నీతివిద్యావిదులు పలుకుదురు. గంధగజం బుబ్బలిలోఁ దగులుకొన్నప్పుడు గంధగజంబె లేవనెత్తవలెనుగాని యాపని యొక్కక్రముక్కడిమృగంబుచేతఁ గానేరదు. సింహళద్వీపాధినాథుం డగు మహాబలాభిధాన సారసకుల పవిత్రుండు మనకు బరమమిత్రుండు గలఁడు. ఆతనిపాలి కిప్పుడు దూతనుబంపి, జంబూద్వీపంబుపయి దండువెడలి మనకుఁ దోడుసూప వేఁడుకొనవలయును. ఇప్పటి కిదియ నాకుంజూడ నవశ్యకర్తవ్యంబుగాఁ దోఁచుచున్నది." అనిన ఱేఁడును గడునలరి మంత్రిం గొనియాడి, తదుక్తప్రకారంబున వేగంబ సుగుప్తంబుగా

నకుం జొచ్చితిమేని, మనకందఱకు నేకకాలంబునఁ గాలంబు చేరువగును. ఈవ్యర్థప్రయత్నముచే మన కవమానంబగుటదక్క నభిమతకార్యసిద్ధి యొదవనేరదు. నాబుద్ధివిని యింక నీప్రయత్నంబు మానుఁడు” అనినం బకపకనవ్వి, బాల్యమునుండియు మోసపుఁబనుల నాఱితేఱినయొకవృద్ధవంచకుండిట్లనియె:—నీకు లోకానుభవంబు చాలమింజేసి బేలతనంబున బాలవాక్యంబులు పలుకుచున్నాఁడవు. నిజముగా నావంటి ప్రౌఢుఁడు దలఁచుకొన్న నీయల్పకార్యంబు సాధించుట యెంతపని? ఫాలాక్షునైనను మోసపుచ్చి యభిమతంబు తుదముట్టింతును. చూడు మే నిదె నీవు చూచుచుండ నాశక్తిచేత నీమేఁకపోతును గుక్కనుజేసి తీసికొనివచ్చి మీకందఱకుఁ గాంక్షలు దీఱ దీనిమాంసంబున విందుచేసి మీచేత నివ్వాడెమెప్పించుకొందును. తొల్లింటికాలంబున నొకమర్కటంబు మకరంబును మోసపుచ్చి కాదె తనప్రాణంబులఁ గాపాడుకొనెను. మీకక్కథ వక్కాణించెదఁ జక్కఁగా వినుండి.

పశ్చిమసముద్రతీరంబుననుండు నడవియందు బలవర్ధనుఁడను ప్లవంగపుంగవుం డొకండు వసియించుచుండును. ఆతండు వార్ధక్యంబున హీనసత్త్వుండగుట చూచి యాతని జ్ఞాతులు సర్వముం దోఁచుకొని యిల్లువెడలనడఁచిరి. బలవర్ధనుండును నడవులపాలయి పోయి పోయి, తపతీనదంబుతీరంబున ఫలభరితంబై యున్న యొక్క మేడిచెట్టు నాశ్రయించి, తత్ఫలాహారంబున శరీరధారణంబు గావించుకొనుచుండెను. ఇట్లు ఫలమాత్రమునఁ బ్రాణభరణము చేసికొనుచు నాయుదుంబరవృక్షముమీఁదఁ జిరకాలము నిర్విచారముగానుండి, యొక్కనాఁడు పండ్లందినుచుండ వలకేలం బట్టుకొన్న పండు ప్రమాదవశంబునం జాఱి నీరంబులంబడి బుడబుడ శబ్దం బొక్కటి పుట్టెను. వానరమున కానినదము శ్రవణానందముగా నున్నఁ దన మర్కటచేష్టలు



బయల్పడ బలవర్ధనుం డపారిగ వారిలోపల ఫలములఁ బడవేయఁజొచ్చెను. దైవవశంబున నావేళనె ఛాయకయివచ్చి చెట్టుక్రింద నీడం బండుకొనియున్న క్రకచంబను మకరం బొకపండు కొని చప్పరించి జిహ్వాకింపుగా భక్షించి రుచిమరిగి మఱియు నోరూర వానరము రాల్చుఫలములనెల్ల మెల్లమెల్లఁగా నాలుకతుప్పవుడల్ల నారగింపసాగెను. ఇట్లు ఫలాపేక్షంజేసి యామొసలి ముసలికోఁతితో మైత్రిచేసికొని, యిల్లును వాకిలియు మఱచి యాలుబిడ్డలం దలపెట్టక నెలలకొలంది నిచ్చటనే కాలక్షేపము చేయుచుండెను. అంత గృహంబున నాతని గృహిణి దుస్సహంబగు పతివిరహంబునకుం దాళఁజాలక పెనిమిటిం దలఁచుకొని యహోరాత్రములు నేత్రములనీరు సంతతధారగాఁ గారనేడ్చుచు, నొక్కదూతిం బిలిచి ప్రాణనాయకుని విలంబనకారణం బారసి యాతని సుఖవార్తను జెవుల వేసి మేనం బ్రాణంబుల నిలుపుమని బహువిధంబులఁ బ్రార్థించెను. ఆదూతికయు నతిరయంబునం గదలి వెదకుచువచ్చి యామేడిచెట్టునీడను గోఁతితోఁగూడనుండి వేడుకమాటలాడుచున్న క్రకచునిం జూచిపోయి, దీనాననంబుతో నామానిని యడుగులంబడి, “మగువా! నీమగఁడొక కోఁతిముగుదం దగులుకొని మగుడనెలవునకు రాఁజాలకున్నాఁ”డని, ఉన్నవి కొన్నియు లేనివి కొన్నియుఁ గల్పించి గుద్దినీరుగుక్కుకొనుచు వినిపించెను. పతి యొండొకసతిం దవిలియున్నాఁడన్నపలుకులు ములుకులవలెఁ జెవినబడినమాత్రమున నుల్లము ఝల్లున నొల్లఁబోయి యల్లనఁ దెలివొంది యామొసలిచెలువ చెలువుని నడతందడవి మనమెరియ వెచ్చనూర్పుచుండెను. ఇచటఁ గ్రకచుండును దూతికయేతెంచి దవ్వుల న్మగుడిపోవుట దూరమునుండి పొడగని గుండెలు తటతటంగొట్టుకొన, అద్ది సదనంబునకుంజని తనమీఁదఁ గామినితో నేమినేరములు చెప్పెనో యని యచట నిమిషమయినఁ గాలునిలువక, వడివడి న్నంగడికాని

ఏడుకొని, యింటి కేగునప్పుడు శూన్యహస్తములతోఁ బోఁగూడదని చేడియలు సూడిదగానిడఁ గొన్ని మధురతర పరిపక్వఫలంబులం గొని హుటాహుటిం జనియెను. ఈలోఁ నామకరాంగన తనచెలులవలనం బతి రాక మున్ముందె యెఱింగి, చెలికత్తియలు నూరెలం జేరి విలపించుచుండ, మూసినకన్నులు తెఱవక పడియుండి మూలుగుచుండెను. కరికచుండును దారం దారసించి కాంచి హృదయంబు పగిలి, నోరుగద్గదికం దగులువడ బడఁతిం బిలిచి యాలబ్ధప్రతివచనుండయి, తత్తరంబున నిదియేమని చెలికత్తియల నడిగిన నుత్తరము లిట్లనిరి. "నీవు వెనుక మఱచి, పోయినపోకగాఁబోయి యింటియొద్దఁ బెండ్లమేమయినను నరే యనుకొని నెలదినములనుండి బొత్తిగా నిల్లు త్రొక్కి చూడకుంటివి. నీవరిగిన మఱుసటిదినము మొదలుకొని నీభార్యకుఁ దీఱనివ్యాధి పట్టుకొని దినదినక్రమమున రోగము ప్రబలి నేఁటియుదయమునుండి మాట పడిపోయినది. తెవులుకనఁబడినది మొదలుకొని రాత్రియనక పగలనక తిరిగి, కన్నకన్నవారి కాళ్లెల్లం బట్టుకొని సొమ్మునకు వెనుకముందులు చూడక మేము మాచేతనయినను లోకములోలేని సిద్ధౌషధములనెల్ల నొకటికాదని యొకటిఁ బోయించితిమి. అంతమాత్ర మింతకంటె నేమిచేయఁగలము? వేసిన మందులెల్ల నేయాలఁబడుచున్నవో కాని లేశమయినను గుణమగపడలేదు. మందులు పోసిపోసి విసిగి వైద్యులు కడచికిత్సయొకటి చెప్పిరి. కోఁతిగుండెకాయ నేయత్నము చేతనైనను సంపాదించి దానిని బాలతో నాలుగుదినములం సాయంసమయమున సేవించుచువచ్చిన రోగము నిశ్శేషమయి యీమెయుదిత బ్రతుకఁగలదనియు, లేకున్న జీవితాశ వదులుకొనవలసిన దనియుఁ దెలియఁజెప్పిరి. చెడఁగాఁ జెడఁగాఁ గాపురములుగావు. మేము చెప్పవలసినది చెప్పితిమి. ఇంక నేపాట్లుపడి వానరహృదయము తెచ్చి భార్యం బ్రతికించుకొనెదవో మీఁద నీయిష్టము." అనినం గొంతతడవు నిశ్చే



ష్టితుఁడయి వితాకుగదిరియుండి, యేమియుం బాలుపోక యాకసంబు వంకఁ దిలకించి పరిపరివిధంబులఁ జింతించి తలపంకించి, యెట్లయినఁ బోక తీఱదని నిశ్చయించి, వారికడ నోరుమెదల్పలేక కదలిచనుచు మార్గంబున నిట్లు చింతించెను: "ఇంట భార్యచూడఁబోయిన వచ్చెదుప్రాణముతోను బోయెదు ప్రాణముతోను నున్నది. వైద్యులో యసాధ్యమయిన యౌషధముం జెప్పిరి. సాధ్యమయ్యెంబో నెయ్యునిం బొలియించునంతటి పనిపుట్టెను. బలవర్ధనుండు దక్క నాకు మఱియొక్క కోఁతి యెక్కడఁ జిక్కును? వానరహృదయ మెట్టులంగునఁ దెత్తును? లేక యీయవస్థలోనున్న సన్నుతాంగి నెట్లు మందుసేయక బలవంతముగాఁ జంపుకోనేర్తును? భార్యానిమిత్తము మిత్రద్రోహము చేయుట తగవగునా? కాదని యెప్పరికించిన నిష్కారణముగాఁ బండువంటి కాపురము కూలిపోవుచున్నది. మిత్రవధంబు దురితంబులలో నెల్ల దురితంబు; జాయ తనకారణంబులో వ్యర్థంబగుటం జేసి యాలిం గోలుపోవుట యాత్మవధంబుకంటెను బాతకంబు. లోకములోఁ దమ్ముపమాలినధర్మము లేదుగదా? సూక్ష్మదృష్టి విచారింప మిత్రునిప్రాణంబులు గొనియైనఁ బ్రాణేశ్వరి ప్రాణత్రాణంబు గావించి యిల్లునిలువఁ బెట్టుకొనుటయే యుచితము." అని కృతనిశ్చయుండయి పదియడుగులు నడచి యంతటి పాపంబున కొడిగట్ట నొకపట్టున మనసొప్పక డోలాందోళనంబునొంది గ్రమ్మఱఁ గొంతవడి విచారించుచు నిలువంబడి, కడకుఁ బాపనిశ్చయుండై బలవర్ధనవధోద్యోగంబున నేగుదెంచిన చెలికానింగని యావనచరవల్లభుం డిట్లనియె: "మిత్రమా! చిత్రమయ్యెడును. కళత్రముం జూడవేడుకపడి గడియకొకింతట నే చని యింతలోనే యేలతిరిగివచ్చినాఁడవు? నీశోకమునకుం గల కారణము తెలుపుము." అనిన నాతక్రింబు వక్రింబుగా నవ్వి యిట్లనియె: "నీచేత ననుజ్ఞాతుండనయి మందిరంబునకుం జని నాసుందరింగని యామందా

నందంబున నిచ్చిన స్వాదుఫలంబుల నొసంగిన నంతరంగంబునఁ బొంగి
యాయంగన కొన్ని మెసంగి వానిరుచి కచ్చెరువడి "యీపండ్లెక్కడివి?
వీని నీకిచ్చిన పుణ్యాత్ముఁ డెవ్వఁడు? నీవిన్నినాళ్ళదాఁక నెక్కడ మసలితివి?
చెప్పు" మనిన, నేనిట్లు చెప్పితిని: "తపతీనదియొడ్డుననుండు మేడిచెట్టు
మీఁద బలవర్ధనుం డనుతరుచరసత్తముం డొకఁడు కలఁడు. అతఁ డనింద్య
చరిత్రుఁడు; స్నేహపాత్రుఁడు; నాకుం బరమమిత్రుఁడు. ఆదయాళుని
యాదరణంబున సమస్తము మఱచి యాతనికడ నపూర్వసుఖం బను
భవించుచు నిందాఁక వదలి రాలేకుంటిని. ఆమహామహుండు నన్ను
సాంత్వవచనంబుల వీడుకొలిపి యమృతోపమానంబులగు నీఫలం
బులనిచ్చి నీయొద్దకుం బుచ్చెను." అని నీయుపకారకృత్యంబులు పొర
కుగతిం బొగడి నీసుగుణసంపదను సహస్రముఖంబులఁ గొనియాడితిని.
నీచెలియ లావలుకులువిని నన్నుఁ గినిసి 'ఓయి! కృతఘ్నుఁడా! సుహృ
త్తముఁడైన యావనచరోత్తముని నీతోడఁ గూడ మనభవనమునకుం గొని
వచ్చి మనపాలిటి వేలుపుంబోలె బూజించి జన్మసాఫల్యంబుఁ గాం
చక యాచెట్టుమీఁద నొంటిం దిగవిడిచివచ్చితివే? ఇప్పుడపోయి
యాకపికులగ్రామణికి నామ్రొక్కని మ్రొక్కి యిక్కడకుం దోడి తెచ్చి
మఱినాతోడ మాటాడుము.' అని వదరి నన్నిచ్చటకుం బంపిన నిన్ను
వెంటఁబెట్టుకొనిపో వచ్చితిని. నాప్రార్థనం బంగీకరించి వేగమ మదీయా
గారంబునకు విచ్చేయుము. పోదము." అని యాకపటాత్ముండు
మిథ్యావినయంబునఁ బలికిన నావానరుండు నెయ్యునిమాట
కడ్డమాడలేక యియ్యకొని యిట్లనియె: "క్రకచా! నాకు నీయిల్లు
లాఁతియిల్లు కాదు; నీయగారంబున కరుదెంచి నీవలని సత్కారం
బులం బడయుటకు నాకేమియు నడ్డంకిలేదు కాని యొక్కప్రతిబం
ధముమాత్రము కనఁబడుచున్నది. నేను వనచరుండనయ్యును నీవనం
బులనె చరియింపఁగలనుగాని మీరుండు వనంబులఁ జరియింపఁజాలను.



మాగృహంబున కెట్లు రాఁగలుగుదునో చెప్పుము." అనిన మకరంబు
కరంబును మిన్నువంకఁ జూచి యాలోచించి యిట్లనియె: "నేనంత
విచారింపక నిన్నుఁ బిలుచుకొని పోఁదలఁచినవాఁడనుగాను. నాయిల్లు నీకు
రారానిచోటు గాదు. మేముండునది యీయేటిలంకలోని యొక
సుందరమందిరము. దానిచుట్టుపట్టుల ఫలవృక్షము లనేకంబులు గలవు.
ఆదీవి మనోజ్ఞకం బేమని చెప్పుదును? అది భూతలస్వర్గంబు నాఁ
జూడ్కికి వేడ్కగొలుపుచుండును. రేపును మాపును మామందిరంబున
సపర్యగొనుచు నిచ్చవచ్చినప్పుడెల్ల నందువిహారంబు సలుపుచుండ
వచ్చును. మార్గంబున నీకొక్కయుపాయంబుఁ గలుగకుండ నిన్ను
నావీపుమీఁద నెక్కించుకొని యుపాయముగాఁ గొనిపోయి మాయా
వాసంబుం జేర్చి నీచెలియ లత్యంత తాత్పర్యంబున నావహించిన
శాకపాకంబులతోడి భక్ష్యంబుల నుపాయనంబు చేసెద. నీసోదరి
మనరాక కెదురుచూచుచుండును. రమ్మా పోయివత్తము' అనిన
మాఱుమాటాడక యాకీశలోకేశుండు వృక్షావతీర్ణుండయి క్రకచుని
వీపునందూఁకెను. దూఁకుటయె తడవుగా మకరంబు సుకరంబుగా
వానరంబును వెన్నుననిడుకొని చనుచుఁ దెన్నునఁ దనలోఁ దానిట్లు
పలుకఁజొచ్చెను. "అయ్యయో! ఎంత దారుణకర్మంబు గావింపఁ
జూచుచున్నాఁడను! ఒక్కయాఁడుదానినిమిత్తము మిత్రముం దోరించి
ఘోరపాతకంబు కట్టుకోవలసివచ్చెఁగా? ఇఁక నేనేదుర్గతికిఁ బోదు
నో యెఱుంగను. ననువంటి దుష్టాత్ము లెందైన నుందురే? దైవ
మా! నేనేమి నిందలపాలుగావలయునో." అని యీరెలుంగున
ననుకొనుచు ఖిన్నహృదయుండై చనుచుండఁ గపివరుండించుకగ్రహించి
"మిత్రుఁడా! ఇప్పుడు నీమోముజాడఁ జూడ నొండొకవిధంబుగాఁ
దోఁచుచున్నది. నీయందు ముందున్నయుత్సాహంబు గానరాదు.
చిత్తంబు విచారాయత్తంబయి తత్తరించుచున్నట్లు కనుపట్టుచున్నది.

